# వెంకటరమణ శతకము



— ఇయ్యది —

## పుల్లె సూర్యనారాయణ.

చే వ్రాయబడినది



వెల **0--2--0**

# — విజ్ఞప్తి —

గురూత్తములారా!

నాకు వ్యాకరణ మన్న నేమో చంధస్సన్న నేమియో పూర్తిగాఁ దెలియదు. అంతియెఁ గాక గ్రంధపరిచయము కూడఁ దక్కువ. అయినప్పటికీ నాజనకుఁడగు ఫుల్లే యప్పల నరసింహుని మనోభీష్టము నెరవేర్చుటకై [illegible] వెంకటరమణ శతకము నత్యంత భక్తితోఁ జెప్పితిని. తప్పులుఁ గలవేనిఁ దగు రీతిని మన్నించి నన్నాశీర్వదింప వేడుచున్నాను.

ఇట్లు, వినయవిధ్యార్థి,
ఫుల్లే సూర్యనారాయణ [ఆఱవఫారం]
పురపాలకోన్నత పాఠశాల
విజయనగరము
22 - 6 - 1943.

# — అభిప్రాయము —

నా ప్రియమిత్రుఁడగు, ఫ్లల్లే సూర్యనారయణచే వ్రాయఁబడిన "శ్రీ వెంకటరమణశతకంబు" నారసి కరంబు సంతసించితిని. ఇందలి పదంబులు వినువారి కెంతయు శ్రవణానందకరమై తనరారు నని నానమ్మకము. బాలభక్తుఁడును "బాలకవియు" నగు నీతనిని సర్వేశ్వరుండగు వెంకటేశ్వరుండు సదా సౌరక్షించుఁ గాక! యని మనంబునఁ గోరు చుంటిని.

ఇట్లు, విద్వద్జన విధేయుఁడు,
కరి అచ్యుత రామారావు, (S. S. L.C
విజయనగరము.
22 - 6- 1943

# ఉపోద్ఘాతము

ఓ! భాషాభిమాన బుధవర్యులారా!

పుల్లే సూర్యనారాయణ యను నితఁడు
తన యేకోనవింశతి (19) వత్సర ప్రాయము
ననె సహజ వాసన సమాసాదిత కవితా సామ
ర్థ్యముఁ గలవాఁడై మాతాపితృభక్తి పరిపూ
రితుఁడై తజ్జనకు మనోభీష్టంబు నిర్వర్తింపఁ
గుతూహలుఁడై కాలవశంగతుఁడగు తజ్జనకునిచే
నిర్వర్తింప బడనట్టి యీశతకమును తన
పంచమ కక్ష్యాపఠన కాలముననె V. Form
పూర్తిఁ జేసి పురపాలకోన్నత పాఠశాలలో
ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు గనున్న నన్ను
సరిచూడఁ గోరెను. అతడు వ్రాసిన శతకము
" కలౌ వెంకట నాయకః" యను నట్లు వెంక
టేశ్వరుని సంబంధించిన దగుటచేతను "గ్రా
మ్యాం బాలాగతి సుభాషితం" యను నార్యో

_ర్తి ననుసరించి యీ త ని శతకమును జదివి యందలి భావమును గ్రహించితి. ఈశతక మందీతఁడు శ్రీమహావిష్ణువే వెంకటరమణుఁ డనియు యా యాయవతార భేదమున రూప భేదముఁ గాంచెననియు యెంచి యాయాయవ తారములందు మహావిష్ణు వొనర్చిన గార్య ముల వర్ణించెను. ఈశతకము భక్తి రసపూరిత ము, మృదుపదసమన్వితమునై యొ ప్పు చున్నది. నేనుకార్యాంతర సమాకులిత చిత్తుఁడ నై యుండుటచే స్థాలీపులాక న్యాయమున త్వరితగతిని యందలి విషయమును జూచితిని. నాయరయుసంతవఱకుఁ దోషములు లేవని నా నమ్మిక. శ్రీ వెంకటేశ్వర చరణ సరోజ మరందాస్వాదానామత్త చిత్తుఁడనగు నాకా దేవదేవుశతకపు నుపోద్ఘాతము వ్రాయు భాగ్య ము చేకూరుటచే నాజీవితము ధన్యము. నాకీ

భాగ్యము కలిగించి నందులకీ "బాలకవి" సూర్యనారాయణుని పురోభివృద్ధిని గోరుచు నాకారుణా తరంగి తాంతరంగుడగు వెంకట రమణుడు యీ బాలభక్తునకాయురారోగ్యైశ్వర్యము, మేధాసంపత్తియు నొసంగి వివిధ గ్రంధరాజకరణసామర్థ్యము ప్రసాదించు గాక! యని యాత్మ గోరుచుండు.

ఇట్లు, బుధజన విధేయుడు,

సోమవఝుల సత్యనారాయణ శాస్త్రి
విద్వాన్

విజయనగరము. } ప్రధానాంధ్రోపాధ్యాయుడు
19 - 6- 1943 } పురపాలకోన్నత పాఠశాల



# వెంకటరమణ శతకము

కం॥ శ్రీపతి! యవతారపురుష!
హేపరమేశా! సుగుణుడ! యినశత తేజా!
భూపరిపాలక! భక్తుల
పాపములెడఁబాపు వేల్పు! పావనరమణా! 1

కం॥ కలియుగదైవమ! గిరులలో [లోలా
కులుకుచువశియించు శుభుడ! కువలయ
ఖలరాక్ష సమర్ధనుఁడా!
జలజాసనజనక! జలధిశయనా! రమణా! 2

కం॥ కరముల శంఖము, చక్రము,
పరికింపఁగఁ బద్మమొకటి, పంకజనాభా
కరముగఁ దాల్చుచు ధరలోఁ
బరగుచు నున్నట్టి సుజనపాలా! రమణా! 3

కం॥ శిరమున నవరత్నములచేఁ
గరముగఁ జూపింపఁబడిన కనక కిరీటం
బరయఁగ రవివలె మెఱయఁగ
కరుణాఢ్యుఁడ యుంటివీవు! ఘనముగ ర॥ 4

కం॥ ఉరమున ముత్యపుహారాల్ [యున్
కరములఁ గనకంపుదండ కడియాల్ మఱి
విరివిగ రత్నపుటందెలు
చరణంబులఁ దాల్చునట్టి సద్గుణ రమణా!

కం॥ బంగరుపతకము మొలయుం
దుంగరములు, జేతివ్రేళ్ల నొప్పుచునుండఁ
రంగుల ధోవతినడుమున
బంగరుఛాయను వెలయఁగఁ బరగెదు ర॥ 6

కం॥ వదనము చంద్రుఁ బోలును,
సదమల! నీకనులుఁబోలుఁ జక్కనిగలువల్
ముదమిచ్చు నీదుదేహం;
బదె పైడిని బోలియుండి, యనయము ర॥! 7

కం॥ సుందర! కనకాంబరధర!
వందిత! సురలోకపూజ! పరమపవిత్రా!
మందరగిరిధర! జగముల
యందెప్పుడు సంచరించు యనఘా! ర॥ 8

కం॥ అనయము నమనులు, మానులు,
వినయములో భక్తజనులు, పేర్మినినిన్నుౕ
మనమున నిల్పుచుఁ గొల్చుచు
వినుతింపఁగ సంతసించు వెంకటరమణా! 9

కం॥ నీవేజగతికి కారణ;
మీవే శ్రీవిష్ణువనఁగ నెలమిని జెపితి
న్నీవే యవతారపురుషు;
వీవే సర్వంబుతండ్రి! యిందిర రమణా! 10

కం॥ తొలుదొల్తను రాముఁడవై [ మందున్
యిలఁ దశరథసుతుఁడవగుచు, యినకుల
ఖలులను జంపగ, యీభూ
వలయములో బుట్టినట్టి, బలుఁడా! ర॥ 11

కం॥ విశ్వామిత్రుని దపమును
విశ్వాసముతోడఁగాచు; విజ్ఞానుండా!
విశ్వంబు మెచ్చురీతిగ
విశ్వంభర! సీతఁబొందు; వెంకటరమణా! 12

కం॥ జంకకఁ జానకితోడను,
పంకజనేత్రుండ! కైక పల్కులమీఁదన్
వంకను లక్ష్మణుఁడుండగఁ
బింకము మెఱయఁగ నటవికి వెడలిన ర॥ 13

కం॥ బంగరులేడది ముంగట
చెంగున గెంతంగఁజూచి చెలియగుసిరి,యా
భంగిని కోరంగ వెడలి
దొంగగు మారీచునటులఁ దునిమిన ర॥ 14

కం॥ వానర బలములతోడను
ఓనరనాథుండ! నీవు ఒప్పునలంకన్
జానకిఁ జేఁబట్టఁగవడిఁ
బూనికతోఁ జేరినట్టి పుణ్యుఁడ! రమణా!

క॥ శరణని శత్రుని తమ్ముఁడు
పరిపరి విధముల నుతింప, భావములోనన్
కరుణను మిక్కిలి బొందుచు
నరయఁగ నాలంకనిచ్చి యలరిన రమణా

క॥ బలుఁడగు రావణుఁజంపిన
బలవంతుఁడ! నీతిపరుఁడ! పాపవినాశా!
చెలియగు సీతామాతను
చెలిమిని గైకొన్న విజయ శ్రీజయ ర॥ 17

క॥ దేవకి వసుదేవులకును [బలమునన్
భావింపఁగ కొమరుఁడవయి బాహా
గోవర్ధనగిరి యెత్తుచు 18
గోవులఁ గోపకులఁగాచు కోవిద! రమణా!

క॥ అందరు కౌరవులుండగ
వందిత పాదారవింద! భక్తుని విదురున్
డెందంబున గోరుచునటు
విందును వాంఛించినట్టి వెంకట ర॥ 19

క॥ పంతంబున దుశ్శాసను
డెంతయుఁ దర్పంబుతోడ నింతినిద్రుపదన్
చెంతను ధర్మజుఁడుండఁగ [నన్
నుంతయు వెనుదీయకుండ శూరత్వము 20

క॥ పతిమందిలోన పరిభవ [దలపన్
మదే,ఁజేయగఁ బూనునపుడు నాత్మను
సుదతికి వలువలొ సంగిన
పృధివీపతి! పుణ్యచరిత! వెంకటరమణా!

క॥ క్రూరాత్ముఁడైన కంసుఁడ [మదిలోన్
క్రూరుని నీదెసకుఁబంపఁ గొంకక
గోరుచుమామను జూడగఁ
గూరిమితోఁ బోయివాని గూల్చిన ర॥ 22

క॥ బుద్ధుఁడవై తగువిధి సం
సిద్ధుఁడవై ముక్తిఁ జూప, శ్రితజనములకున్
యుద్ధరియితిని వెలసిన 23
ముద్దుల దేవుండ పరమపురుషా! రమణా!

కం॥ అరయ పరశురాముఁడవై [కూత్రే
యిరువది యొకమారు ఖలుల, యినులను
ధరలో కడునొప్పిన, ఓ
కరుణాకర! దీనజనులఁగాచెడు రమణా! 24

కం॥ సురలోక రక్షణార్థము [నగుచున్
పరమ దయావతి, యదితికిఁబాలుడ
గిరిధర! తగురీతినియా
సురులను గాపాడినట్టి శూరుఁడ! రమణా!

కం॥ బెట్టిదపుభక్తి బలియపు
డట్టులఁ దానములుచేయ, నవనీస్థలిలో
బుట్టితివి వామనుఁడవై
దట్టపు సంతసముతోడ తండ్రి! రమణా!

కం॥ వినయుంబున బలిదరికిఁ [శయనుఁ డా!
జని, మూడడుగుల తలమును సర్వ
ఘనలోర్కెతోడఁ బడయుచు
ఘనునకు పాతాళమివ్వ గల్గిన రమణా! 27

కం॥ అరయ మత్స్యావతారము
వారిజనేత్రుండ! యెత్తి వడి వేదములన్
ధీరుని సోమకుఁ జంపుచు
నారీతిని యజునకొసఁగి యలరిన రమణా!

కం॥ మందరపర్వత మబ్ధి
తొందరచే నీటమునుఁగ తోవదిలేకన్
డెందంబున దేవాసురు [ముగ
లందరు నినుగొల్వ భక్తినతి చోద్య 29

కం॥ మునుఘన కూర్మమునగుచున్ [మొప్పన్
ఘనతరమగు మందరమును గడుబల
అనిమిషయోధులు, జూడఁగ
వినువీధికి నెత్తినట్టి వెంకటరమణా! 30

కం॥ దేవాసురు లమృతంబును [చేయఁగ
భావంబునఁ గోరియెంతొ, పానము
ఆవిధి కయ్యము లాడగ
దేవా! స్త్రీరూపమెత్తి తేజమలరగ 31

క॥ కోరుచునా సుధనప్పుడు
కూరిమితో సురులకెల్ల గొంకకిడితి; వీ
ధారుణిలో పేరొందిన
కారుణ్యమయా! రమేశ! ఘనుడా! ర॥ 32

క॥ ధరలో హిరణ్య దానవుc
బరిమార్చుచు వానిసుతునిc పాలన చేయన్
నరసింహుండవై బుట్టితి [రమణా!
వరయంగ నీ ధాత్రియందు, నలఘుండ 33

క॥ ఇత్తఱినిది యొకజన్మం
బెత్తితి వీయుగము నందు నెల్లరc గావన్
మెత్తని దేవుడ వీవే
చిత్తములో నెంచి చూడ, సీతా ర॥ 34

క॥ పదినొకటవ యవతారం [జూడన్
బిదియంచును దోచెనయ్య, యిప్పుడు
పదిలముగ మమ్ము నీదగు
మదిలోపల నిల్పఁగోరు; మాప్రియ ర॥ 35

కం॥ గిరిధర! గిరీశ! వరదా!
కరుణాఢ్యుఁడ కంజనేత్ర! గరుడవిహారా!
సిరిసఖ! మన్మధజనకా!
సురలోకానీక సేవ్య! సుందర రమణా! 36

కం॥ గిరులేవికుంఠ మయ్యా!
'సిరియే' మంగమ్మతల్లి, చెప్పుచు నుంటి
న్నెరిగిన తెలుగున ప్రీతితో
తిరుపతిపుర చరితమంత దేవా రమణా37

కం॥ ఆపుర గేహములందున [ధన్యులుపో!
గోపురములుఁ జేయువారు కదుఁ
ఏపున నిను గీర్తింపగ
బాషములెడఁబాపు దీవు; పావన ర॥ 38

కం॥ కొందరు సుమముల పూజల [నుండన్
కొందరు ఘనకీర్తనములఁ గొల్చుచు
డెందములో నుప్పొంగెదు
బృందావనలోల నాకవాసా! రమణా!39

కం॥ లీలా! నినుపొగడంగను,
హాలాహలధరునకైన నాయజునకైన
నీ్నలోనేమి మహత్యము
పూలవిలుతుగన్న పుణ్యమూర్తీ! రమణా
కం॥ కేశవ! కోసలదేశపు [తిలుకా
యీశా! కౌసల్యతనయ! యినకుల
ఆశల బాపెదు వేల్పా!
నీశిశువుని నెట్లుఁగావ నేర్తువొ రమణా!
కం॥ ఎందఱిఁ గావగలేదర
విందనయన! మున్నునీవు; విశ్వంభరలో
అందఱివలెనే నన్నుఁ
డెందములోనెంచి; కావు శీఘ్రగ రమణా 45
కం॥ గోవిందా! చ్యుత! విష్ణూ!
కోవిద! నర్సింహా! నాదు కూరిమి దేవా!
ఓవడ్డి కాసులవాడా!
వేవిధినిను వేడుచుంటి, వెంకట రమణా 43

క॥ నా మొఱ వినఁగా లేవా?
మోమాట మదింత లేద? భువనేశ్వరుడా!
యేమని యెంచుచు నుంటివి,
నామనసును దీర్పనింక నాహిత రమణా 44
క॥ బాలుడ మన్నింపయ్యా! [తోడన్
యేలోపములున్న బోవు; యెన్నము
ఏలనునా పైఁగోపము
చాలింపుము, సత్వరముగ జానకి రమణా
క॥ కనకాంబరధరరావా!
వినవా నీసుతునిమాట వేడుకతోడఁ
కనికర మింతయు లేదా?
అనిశము నినునమ్మువారి నణతువ ర॥
క॥ దేవా! నీవే నాకిఁక [తోన్
గావంగను బూనుమంటి, కడువడి దయ
భావములో దలపుము, నా
భావంబు నదీర్పనింక; వరదుడ రమణా! 47

కం॥ నీనామమె పరమాన్నము,
నీనామమె సర్వరక్షణీయము సుమ్మా!
నీనామపఠనె మోక్షము,
నీనామమెయమిత సౌఖ్య నిలయము ర॥48

కం॥ సురుచిరమూర్తివి నీవన
సిరివన్నె కుమూలభూత! శేషసుపాలా!
స్థిరమతి నిన్నెదఁ గొల్వని,
పురుషుండిలఁ బుట్టనేలపూజ్యుడ! ర! 49

కం॥ అరయఁగ నెందరొ నిన్నన్
పరిపరి విధముల నుతిఁచు భావములోనఁ
ఎఱుకను వారల నెట్టులఁ
బరగన్ జేబడ్డువీవు; బరగుచు రమణా 50

కం॥ అనయము గోవిందా! యని [లలో
మనమున నినుగొల్చినట్టి, మానీందు
ఘనుడగు నారదు నెట్టుల
ఘనముగఁ జేఁబట్టినావు కావఁ ర॥ 51

కం॥ రమణా! రమణా! యంచును
కమలాక్షా! నిన్ను నెల్ల కాలములందున్
రమణీయ భక్తిఁ గొల్చిన
నిమిషములో సంతసముల నీయవె ర॥ 52

కం॥ నీపేరెత్తిన జాలును [రవనిలో
కాపురుషులుఁ గూడ ముక్తి గాంతు
నేపరియుండెడి భువనము
లేపున సౌభాగ్యమందు నింపుగ, ర॥ 53

కం॥ సర్వము నీవై యుందువు [తోడన్
సర్వంబును దెలిసికొనిన శాంతము
గర్వాంధకారమగ్నులు
యుర్విని నీమహిమ దెలియ నొల్లరు ర।

కం॥ నాదీ మాదీ యంచును
వాదంబుల నాడువారె; పంతం బొప్పన్
ఏదీ తిరుపతి చరితము
మోదంబుగ విందు; నంచుఁబూనరు ర॥

కం॥ కోరిక విడువక, సతతము
బేరాశలతోడఁగూడి, వీనులతో నీ
చారిత్రగాధ వినకను,
కారుణ్యములేక, మనుట ఘనతా! రమణా
కం॥ ఎందరొ పెద్దల్ జ్ఞానము
డెందములోఁ గల్గియుండి ఠీవిగ నున్నన్
పొందది లేదయ వారికి,
నందఱ సమబుద్ధిఁ జూడనయ్యా! రమణా!
కం॥ బీదల, సాధుల, భక్తుల
సాదరముగఁ జూచునట్టి సద్వర్తనుడే
మోదమునిచ్చెదు నామము
మేదిని వహియింపఁగలఁడు మేటిగ ర॥
కం॥ ఎంతటి భాగ్యం బున్నను, [సుమ్మా!
సుంతయు సౌఖ్యంబునీయఁ జూడదు
కొంతేని భక్తియుండిన
నెంతయు సౌఖ్యంబునిచ్చు నెప్పుడు ర॥59

కం॥ సతతము నిను నుతియించిన,
వితత జగద్భరుండ! నీవు వేడుకతోడన్
సుతురీతిం గావకుందువె
యతిచోద్యముతోడవచ్చి యనఘా ర॥

కం॥ నారాయణ! దామోదర!
శ్రీరామా! లోకనాధ! శేషశయానా!
క్షీరాబ్ధినిలయ! మోహన
కారా! నన్నేలనీవుకావా? యనుచున్—

కం॥ పుట్టినదానిగ నిన్నున్
గట్టిగ నెదనమ్ముకొన్న ఘనప్రహ్లాదున్
ఎట్టులఁగాచితి వప్పుడు,
పట్టుదలతో వానిజేరి భవ్యుఁడ! రమణా

కం॥ తెలిసితి నీదగుమహిమను,
దెలిసితి నీభావమంతఁ దీనదయాళో!
చెలిమిని భక్తులఁగాతువు
చలమున దుష్టుల నణంపసాగుదు; రమణా

కం॥ నమ్మినమోసముఁ జేయవు [సుమ్మా!
సుమ్మా! యెటులైనఁగానఁ జూతువు
నమ్మితిఁ గావున నేనిను
లెమ్మా! వేగంబెఁ గోర్కె లిమ్మా! ర॥

కం॥ వెన్నలదొంగా! యికనీ [రావా!
కన్నసుతుని మాటికినన్నుఁ గావఁగ
యెన్నడు నిను విడకనే
మన్ననతో పూజఁ జేయు; మరుపా! ర॥ 65

కం॥ పాపఁడ నంటిని, పాపాల్
పాపఁగవే బూనుమంటి బద్మదళాక్షా!
కాపాడఁ బూనకుంటివి,
నాపాపమదేమొఁగాని నగధర! రమణా!

కం॥ నీవన సర్వజ్ఞుండవు
నీవిటు జాలంబుఁ జేయ నెంచుట తగునా!
నీవేమినన్ను బ్రోవఁగఁ
భావంబునఁ దలపవైతి; భావ్యము! ర॥ 67

కం॥ ఎంతని నిన్ భజియింతును,
ఎంతని నీ స్మరణఁ జేయనెంతును మఱిరో
ఎంతని బొగడుదు నిన్నుఁ
వంతల నెడఁబాప రావు; వడిగా, ర॥ 68

కం॥ చిలుకలపలుకుల తోడను [లేదా!
గులుకుచు నినుఁ బిలుచుచుండఁ గూరిమి
అలుకేలఁ బూనవిప్పుడు
పలుకవు? నాతోడనేలఁ బంతము? ర॥ 69

కం॥ తెలియకఁ బల్కితి నట్టులఁ [మొదవన్
జలముంచకు మయ్యా! నాకు సంతస
గలతంతఁ బాపఁ జూడుము
పలుమరు నేవేడుచుంటి; భక్తిని ర॥ 70

కం॥ చందనగంధముఁ బూసెద
నందముగా నీదు దేహమంతట నెంతోఁ
విందుల్గఁ బెట్టెదఁ గొప్పగఁ
బొందున నను నెప్పు డరయఁబూనుము! ర॥

కం॥ చల్లనిపన్నీర్ నీపై
జల్లెదనో జలజనాథ! చల్లగనుండన్
గల్లని యరచకుమదిలో
జల్లగ నను బ్రోవరమ్ము; శౌరీ! ర॥ 72

కం॥ నీదగు దర్శన భాగ్యము
లేదే! నాకికను ప్రేమ లేశము లేదా?
వాదేల? బాలభక్తుడ,
నాథా! నాదైవమీవు, నగధర! ర॥ 73

కం॥ బలమది తగ్గగ మొసలిని [లేకన్
నులువుగఁ బరిమార్చునట్టి సూత్రము
వెలవెలఁ బోవుచు, కరియపు [వడిగాన్
డెలమిని నినువేడగాను, డెంతయు

కం॥ జని,యా మొసలినిఁ జేరుచు [నెవ్విధిగా
ఘనబలమునఁ దానిఁ జంపి; కరి
ననువైన ప్రేమఁ జూపుచుఁ
గొనియాడునుఁ గాచినావు; గోపాలా! ర॥

కం॥ ఓ! పన్నగశయనా! నీ
కాపన్నులఁ గావ నెంతో నానందమొకో!
ఆపద లెట్టివి రైనను
బాపఁగ నెత్నింతు వీవు; వరదా! ర॥ 76

కం॥ నిను నమ్మినఁ జెడిపోరయ!
నినుఁ గొల్చిన రిత్త వోదు; నీరజనేత్రా!
అనుమాన మేలనింకను
మనమున నిను వేడుచుంటి; మనుదును ర॥

కం॥ నీ నామామృత మెప్పుడు [నలరుదున్
నానంగముతోడఁ దావి; నాత్మ
నీనామ కీర్త నాపధ
మే నెంతయు వాడి తనవు నీడ్చెదర॥ 78

కం॥ రమణా! యనగను దొలగను [గల్గున్
శ్రీమలన్నియు నొక్క సారె; శాంతియుఁ
మమతలు మలఁగును గష్టేల్
నిమిషములో నెగసిపోవు నిక్కము ర॥79

కం॥ కావున నేనినుఁ గట్టిగఁ
భావంబున నమ్మికొంటిఁ బరిపరిగతుల
న్నేవిధి రక్షణ చేతువొ
ఓవిసు దేవాత్మజుండ! ఓయీ! ర॥ 80

కం॥ పన్నెండేఁడ్ల విధినా
పన్నుండై రామదాసు బంధీతుడై యె
న్నె నోర్మి యిడుములఁ బడగను
గన్న సుతుని మాటక్కై నెట్లుకాచితో; ర

కం॥ తినగను యన్నము లేకను,
జనుటకు మార్గంబు లేక; సరగున నిన్నుఁ గ
గన నటువచ్చు కుచేలుని
ఘనముగ నెటునాడు కావఁ గల్గితి; ర॥ 82

కం॥ భక్తిని ధృవుడట్టలనను [తోడన్
రక్తిని మదిగొల్వ నెంతో; రభసము
భక్త జనావన! నీదగు
శక్తిచె నేరీతిఁగావ సాగితి; రమగా! 8

క॥ శాపముచే శిలయైపరి
తాపంబును భొందుచున్న దాపసి భార్య
న్నే పగఁది రూపమిచ్చుచుఁ
గాపాడితి; వల్లనాడు కరుణన్ రమణా! 84

క॥ తప్పునుగావు మటంచును
అప్పుడు కాకాసురుండు అతిదీనతతో
నప్పగఁది వేడఁగానిను
నొప్పున నెటుగాచి నావు ఒప్పుచు ర 85

క॥ ఆరీతినె నన్నుఁగూడను [యొప్పుడుఁ
ఓరిమితోఁ గావఁ బూను మోడక
గోరితినంతియె హితమును
ఓరవికుల సార్వభౌమ! ఓగురు! రమణా!

క॥ ఎక్కువ సంపద నిమ్మని
మక్కువతోఁ గోరినాన? మాధవ నిన్నున్
జిక్కులఁ బాపుచు నెంతయు
నక్కటికము తోఁడజూడు మంటిని ర॥

క॥ నిత్యము నీదగు సేవన్
భృత్యుఁడనై జేయఁబూని, పరమఘనుండా!
అత్యంతవాంఛ నుంటిని
సత్యంబని నమ్ము మయ్య! జయజయ ర॥

క॥ విడువను నీపై భక్తిని
గడవను నీయాన నెప్పుడు కంజదళాక్షా!
యిడుమలఁ బాపఁగ నెంచుము
అడుగడుగున నిన్ను దలతు ననిశము ర॥89

క॥ మానెదఁ బాపపు కృత్యాల్ [వినుతా
పూనెద సుకృతములుఁజేయ పురహర
నీనామంబను నావను
నేనీదెదఁ గష్ట సంధ్రి మెంతయు రమణా90

క॥ చెలగను వధులేమన్నను
గలఁగను కష్టంబదెంతఁగల్గిన నరయోఁ
గులుకుచు నుండెద నెప్పుడుఁ
బలుమరునిను గొలుచుచుండి పరగుచుర॥

కం॥ కలిమిని గోరనుసుమ్మా! [నిలలోఁ
పలువిధముల సుఖములెన్నోఁ బడయుఁగ
గలుషములెల్లయుఁ బాయుఁగఁ
గలియుగ దేవుండ! కోఁగల్గుదు, రమణా

కం॥ నీదాసు దాసుఁడ! దేవా!
నీదశ్యము నెల్ల వేళ నీమముతోఁ దగ౯
సాదర మొప్పఁగఁ జేతును
మోదముతో నాజ్ఞయిమ్ము మోహనర॥

కం॥ మెఱుపును బోలెడుజీవన [ముచ౯
మరయఁగ నిక్కువమటంచు నాత్మనలరు
జరియింపఁ దోలుత నెంచితిఁ
గరుణామయ! తప్పగాదె? కావుము ర॥

కం॥ దీనుల బాధలుఁ బాపెడు
దీనావన! సర్వరక్ష! తిరుపతి నిలయా!
దీనుఁడ! నీకై వేచితి,
బూనుము నీమూరి జూపఁ బొందుగ ర॥

కం॥ పట్టితి నీచరణంబులఁ
బట్టితి, నీదయనుబొందఁ బంతముఱెంతో
నెట్టుల వాంఛలదీర్తువొ?
గట్టిగనిను నమ్మికొంటి; ఘనుఁడా ర॥ 96

కం॥ మానవనాథా! నీదయ
మానస మొప్పంగఁజూపి మాకష్టములన్
బోనీయఁ జూడుమయ్యా!
నేనెంతయు వేడుచుంటి నెమ్మది ర॥ 97

కం॥ ఘనతర భక్తినిగొల్చెద
ననిశము నీవిగ్రహంబు నతిచోద్యముగన్
గనికర మెంతయుఁ జూపుచు
వినవెంచుము నాదు మొరలు వెంకట ర॥

కం॥ నీవే తల్లివి, దండ్రివి,
నీవే నాగురుఁడవయ్య నిరుపమ తేజా!
నీవే నాధనధాన్యము,
లీవే నాసౌఖ్య నిలయ మెంచన్ రమణా

కం॥ చిత్తము నీయందుంచితి [నేనే,
నిత్తెరఁగున నెంతో భక్తి నిప్పుడు
తత్తరపాటును లేకను,
ఎత్తెరఁగునఁ గావఁ బూననెంతువు? ర॥100
కం॥ మృదుపల్కుల శతకంబును [నిన్నున్
మదినెంచుచుఁ జెప్పినాఁడ; మాప్రియ
బృధివిని వినుతించుటకై
పదభక్తుఁడ నంచుఁ దెలియపరచఁగ ర॥
కం॥ తప్పులు మన్నింపయ్యా! [లోలా!
యొప్పుగ నా ప్రియముగోరి యుర్వీ
చెప్పను యాడంబరముల
నెప్పుడు నెవ్వరి లోనైన నెందును ర॥
కం॥ తిరుపతివాసా! నీదగు
చరణంబుల నమ్మువారు, సద్వర్తనుల్
బరగ నీ పద్యంబుల
నరయుచుఁ జరియింతురిగాక యవనిలోర॥

